కిత్త: సూసిసానులే. ఇదిగో అచ్చీ, ఒక్క మాట.

అచ్చి: యేంటది?

కిత్త: మనం మళ్ళీ యెప్పుడు కలుసుకోడం?

అచ్చి: (సిగ్గుతో) మన పెళ్లప్పుడే. మావోళ్ల నొప్పించుకో.

కిత్త: మరి మీవోళ్లొప్పుకొంటారా?

అచ్చి: పంచాంగం సదివినోడివి నీకు తెలకుండా వుంటాదా!

కిత్త: నా పంచాంగం, నీ పంచాంగం తెలుస్తాదిగాని, మీవోళ్ల పంచాంగం నాకెలా తెలుస్తాది?

అచ్చి: అయ్యోరికి దచ్చినిస్తే మనక్కావొలసిన పంచాంగం సెప్పడూ? మావోళ్ళక్కూడా యిచ్చుకొంటే, ఆళ్ళే సెప్తారు.

కిత్త: మరి నీపంచాంగం సెప్పడానికి నాకు దచ్చినొస్తాదా, రాదా? అదాళ్ళ కిచ్చేసి, నువ్వే వొప్పించు.

అచ్చి: సూసుకొందాములే. పొద్దోయింది. నాను పోతాను. మావోళ్ళు మంచోళ్ళు కారు. మన సంగతి తెలిస్తే యెముక లిరగ్గొడతారు.

కిత్త: మరి నీమనసేటో సెప్పినావుకావు.

అచ్చి: నీ మనసే నా మనసు.

కిత్త: అయితే సెగు. తూర్పు తెల్లారేసరికి తుంగబద్ర సేరుకొందాం.

అచ్చి: పద. నీ యిట్టమే కాని. (పాడుకొంటూపోతారు.)

అదిరా – నా – గుండె – బెదర – మధుర – వె – న్నెలలోన
నిమరకు – దూరమైతిని – గదర – చెలి – మోహనరంగ – నిమరకు—.

కనుల – కా – టుక బెట్టి – కడవ – చం – కను బెట్టి
కన్నీళ్లే – కడవ నిండెను – గదర – చెలి – మోహనరంగ – కన్నీళ్లే

మంచినీ ళ్ల – బావికాడ – మల్లెపూ – ల – తెప్పకట్టి
తెప్పమీ – ద – తేలిపోదాం – పదరా – చెలి – మోహనరంగ—
తెప్పమీద.

(పోతారు)

తెర.

## రంగము ౨.

(తుంగభద్రాతీరము. గుడిసెముందు చెట్టుకింద. అచ్చి, కిత్తయ్య.)

కిత్త: ఆచ్చీ, ఆవుల్ని దూడల్ని వొదిలినావా, మేతకి?

అచ్చి: వొదిల్నా; రా, కూకో కూడు తిందాం.

(కంచం పెట్టుకొని యిద్దరున్ను కూర్చుంటున్నారు.)

కిత్త: ఏమచ్చీ, నంచుకోడాని కేమీ సెయ్యనేదే!

అచ్చి: యిదిగో, యీ మాగడ నంచుకో.

కిత్త: నాలిక సురుగ్గమన్న దేమీ లేకపోతే యెలా?

అచ్చి: చెంప సురుగ్గమనాల. మాగడ తినమంటే యేం తీపి దిగేసింది.

కిత్త: యెప్పుడూ మాగడే? యెప్పుడూ పాలే? యెప్పుడూ జొన్నే? యిసుగెత్తి పోతున్నాది.

అచ్చి: నీ యచ్చికూడా యిసుగెత్తి పోతున్నాదేమో?

కిత్త: అచ్చేల యిసుగెత్తుతాది! ఆయిటయిటికీ రుచి మారిపో-తావుంటాది నాయచ్చి. సేరదీసిందంటే తీపి; కసిరిందంటే కారం; వూరుకుంటే వుప్పు; దూరం పోయిందంటే

పుల్ల; సికాకుపడితే సేమ;—అన్నీ కలుస్తేనె అచ్చి. నేకపోతే మొగం మొత్తిపోదూ?

అచ్చి: అయితే. నీకు తీపి యిసుగెత్తిందన్నమాటే. కారమే కావాలగదా?

కిత్త: తీపి తరవాత కారం; కారం తరవాత తీపి. యెలుతురు పోతే సీకటి; సీకటిపోతే యెలుతురు వోస్తుండవూ?

అచ్చి: నాకెప్పుడూ తీపే కావాల. యెప్పుడూ యెలుతురే కావాల. సీకటొస్తే దిగులేస్తాది.

కిత్త: నా నుండగా నీకేటి దిగులు?

అచ్చి: దిగులేనబ్బా! నీమాట లింటావుంటే, అదేటో అర్థాలు తగులుతా వుంటాయి, నా మనుసుకి. నాకు దినాము కలలే. రేతిరి నిదరొట్టడం లేను,

కిత్త: యేం కల లొచ్చినాయి?

అచ్చి: అదోడో నల్లగున్నాడు. మనగుడిసెలో దూరినాడు. మంచం కింద పొంచున్నాడంట. మనమాటలన్నీ యి-న్నాడంట. అబ్బా! అది తల్సుకొంటే వొళ్లు జల్లుమంటున్నాది.

కిత్త: అడేమి సేసినాడేటి?

అచ్చి: మంచం కిందినుంచి మెల్లిగా వొస్తావుంటే, తుళ్ళిపడి నీగొంతుక గట్టిగా పట్టుకొన్నాను. (మెడ కౌగిలించుకొంటున్నది.) నువ్వుక్కిరిబిక్కిరయినావు. 'వొమలు, వొమలు' అని నన్నిడిపించుకొని దూరంగా పోనావు. తరవాత నాకు నువ్వు కనబడ్డమే నేను అడు నన్ను "నడు, నడు" అని గెంటుక పోయినాడు. అబ్బా మామా, నాకు బయమేస్తున్నాది.

కిత్త: ఓస్ యెర్రిదానా, నానుండగా నీకేం బయం? రా, బువ్వతిను. యేటిగట్టుకు పోయి ఆవుల్నితోలకొత్తాము. సూడు, మన లక్ష్మావు నేడో, రేపో యీనతాది సుమా. నాను సెప్పినాను సూడు, అది కోడెదూడ నేస్తాది.

అచ్చి: నేను, నేను, ఆవుదూడనే యేస్తాది. నీకేటి తెలుస్తాది, యీనడం సంగతి? మొగోడివిగనక మొగదూడంటావు.

కిత్త: పందెమా, మరి?

అచ్చి: ఆ, పందెమే.

కిత్త: యేం పందెం, సెప్పు.

అచ్చి: కోడె దూడనేస్తే నీది; పెయ్యదూడనేస్తే మనది.

కిత్త: యెంతగడుసుది! నానొప్పుకోను. మరొక్క పందెం సెప్పు.

అచ్చి: పెయ్యదూడ నేస్తే, గుడిసెలో పనంతా నీది. కోడెదూడ నేస్తే బయటిపనంతా నాది.

కిత్త: అబ్బో, నాయచ్చీ! నన్నాడదాన్ని సేస్తావో? నువ్వు మొగోడివయి పెద్దరికాలు సేస్తావో? కానీలే, వొప్పు-కొన్నా.

అచ్చి: మామా, మామా, అమగో యేటివిూంచి పడవొస్తున్నాది. యెప్పుడూ యీదిక్కు పడవరానేదే! అల్లో ల్లో!

కిత్త: ఓల్లో, అల్లదారి నాళ్లుపోతావున్నారు. మనకేల?

అచ్చి: మనకోస మోరయినా రానేమగదా!

కిత్త: మనకోస మోరొస్తారు? మనమీాడనున్నట్టు ఓరికీ తెలమలే.

అచ్చి: ఆ ల్లెంతసక్కంగా పాడతున్నారో! మామా. నీకా-పాటలేమేనా వొత్తాయా?

కిత్త: నాపాటల లచ్చి! యేం, నువ్వాపాటలు నేర్సుకొంటావా?

అచ్చి: యాదీ, వొక్క-పాట సెప్పు, సూదాము?

కిత్త: నేర్సుకో మడి.—

పొంగుతాదీ - జీవం - కుంగుతాదీ,
పొంగు కుంగు - పనియేముంది
తొంగునోడికి - తొరయేముంది

కుంగి నోడే – కొస కేలాగో
వొంగుతాడని – పోలుసుకోండి హొంగు.

కింది కళ్ళాలీ – మళ్ళీ – మీదికళ్ళాలి
కిందూ మీదూ – ఊగులాటనె
అంద మంతా – అణగి ఉంది
కిందని కించ – పడకండి, మరి
మీదని మిడిసి – పడకండన్నా. హొంగు.

అచ్చి: యొర్రి యేదాంతం. యాడ నేర్సినావు, మామా, యీపాట ?

కిత్త: సిన్నప్పుడు కిట్టమీద తిరిగినాను. ఆకిట్టయేణమ్మ తల్లి పేరే మాయమ్మ నాకెట్టింది.

అచ్చి: పాటబాగుంది సుమా. యాదీ మరొక్కటి ?

కిత్త: (పాడుతున్నాడు)

యెత్తర తెరసాప – వోడమీది సిన్నవోడ... యెత్తర

కోల కట్టిపెట్టరయ్యా – వోలపాట పాడరయ్యా
యేలరయ్యా అలసిపోతా – వింక కూరుచుండుదాము...యెత్తర

రింగిణీలు కట్టరయ్యా – రేవుకు పొంగ పెట్టరయ్యా
లంగరెత్తు కోనివ్వండి – గంగమ్మకి దణ్ణాలెట్టి... యెత్తర

జాయచక్కగుందిరయ్యా - హాయిగ పోతుందిరయ్యా
తోయగ నక్కరలేదు - తొందరగా నడుస్తాది... యెత్తర
ఎదరలేదు బెదరలేదు - సమనుగానె పోతున్నాది
అమనుచూచి కొయ్యనిలిపి - అంజాలు లాగిపట్టి... యెత్తర
గాలి నిండుకోని వుంది - కదిలిపోతున్నాది నావ
యేల సూస్తూవూరుకొంటూ - వెర్రిమోగ మేసుకోని...యెత్తర
చూడ సక్కనైననావ - సొంపులు గులికేటినావ
వోడవర్తకానికి సా - రాజ్యానికెళ్ళేనావ... యెత్తర

అచ్చి: శాబాసు! వోరుకట్టినారో, యీ పదం? యెంత సక్కగుందో!

కిత్త: మా పడవమీ దొకయొయ్యా రుండేవోడులే. పేరు మరిసి-పోనాను. అఁ! అఁ! నారాణప్పయొయ్యా రాయన పేరు. సూడ్డానికేమీ తెలన ట్టుండేవోడుగాని, యాడ కట్టేసే వోడో! పదాలంటే పదాలుకావు. అ ఆయొయ్యారు కడుపు నిం...డా పదాలే.

అచ్చి: యాదీ, అయొయ్యారి పదం, మరొక్కటి?

కిత్త: రా, పాడుకొంటూ పోదాం: నువ్వూపాడు.—

దణ్ణాలే – దణ్ణాలు
మాతుంగ - బదిరిమ్మ – దణ్ణాలు

నిండుదయతో నేలె — దణ్ణాలు
మాతుంగ — బద్రమ్మ — దణ్ణాలు
పొంగి పొ — ర్లి రాయే — దణ్ణాలు
మనసు — పొంగింపరావమ్మ — దణ్ణాలు
పాయ — పాయలై — రావమ్మ — దణ్ణాలు
పాడి — పంటల నివ్వవే — దణ్ణాలు
నిను నమ్మికొన్నామె — దణ్ణాలు
తల్లి — సిదయ — చూపవే — దణ్ణాలు.

(పోతారు)

తెర.

## రంగము 3.

[తుంగభద్రి ఒడ్డు. కిత్తయ్య గుడిసె, గుడిసెలో అచ్చి. ఇద్దరు పడవవాళ్లు ప్రవేశము.]

ఒకడు: వోరయ్యో, గుడిసెలో?

(అచ్చి తలుపుతీసి ప్రవేశిస్తున్నది.)

అచ్చి: వోరదీ? వోరుమీరు?

రెండో: యేటిలో పడవ మెరకెక్కి—పోనాది. తొయ్యాలంటే యీలులేకండావుంది. యీడ సెడయినా మొగో-ళ్లున్నారా?

అచ్చి: మాయింటోడు పశువు వెంట పోనాడు. మరోరూ నేరు.

ఒకడు: యెంతసేపవుతాదో, వొచ్చేసరికి?

అచ్చి: అలబొద్దేళవుతాది. మద్దేన్న మింటికిరాడు. నానే కూడొట్టుకపోతా.

రెండో: అయితే, అయప్పొచ్చిందాకా యీడనే వుండాల గావాల.

అచ్చి: అక్క—ర్లేను, పొండి. అమగమగో అకొండకాడ మర్రి-సెట్టు నేదూ? అడనుంటాడు. పిలుస్తే వొస్తాడు.

ఒకడు: మాము నడవలేము. ఎండబడి పోనాము.—పిల్లా, దాగానికి రన్నిళ్లు సిక్కుతాయా?

అచ్చి: దానికేం బాగ్గం? (లోపలికి పోతున్నది.)

రెండో: వోరే, యెంతసక్కగుందిరా, యిది? యీడనేలుందో? సుట్టుపక్క లేడా కొంపే కనబడదే!

ఒకడు: యేమిరో, దీనిమీద కన్నేసినావా, యేటి? నీకొక్కవాలా, సెప్పు.

రెండో: మరి సాయం సేస్తావా?

ఒకడు: అదెంత పనిలే.

రెండో: దానిమొగు డెలాంటోడో! అడిగ్గానా కనబడినామంటే, సిక్కులో బడతామే!

ఒకడు: అవూసు నీకేల? వుండు. అమగో వొస్తున్నాది.

(అచ్చి ప్రివేశము.)

అచ్చి: యిదుగో, దాగం పుచ్చుకోండి. (ఇస్తున్నది.)

ఒకడు: ఆహాహా. పానాలు లేసొచ్చినాయి. మజ్జిగతేట, మా బాగుంది! తాగురా నువ్వుకూడా.

రెండో: యేదీ? (అచ్చిపోస్తున్నది.)

అచ్చి: యేమన్నా, యింకా పొయ్యనా?

రెండో: మరొద్దు, మరొద్దు. కడుపు నిండిపోనాది.

అచ్చి: యాపూరన్నా మీది ?

ఒకడు: మాది శానా శానా దూరం రాజ్యం.

అచ్చి: యెంతదూర ముంటాదో ?

రెండో: ఓయబ్బో! శానా శానా దూరం.

అచ్చి: ఇక్కేడ పోతున్నారో ?

ఒకడు: శానా శానా దూరం.

అచ్చి: అంటే యాపూరో ?

రెండో: బెజవాడావల బందరు పోవాల.

అచ్చి: ఆ బందరీడకు పదిపరువు లుండీనా ?

ఒకడు: (నవ్వుతూ) ఎయ్యిపరువు లుంటాది. నీకేం సూడాల నుందా ?

అచ్చి: నాకేల ? మాయింటో డొకనాడు ఆవూరిపేరు సెప్పితే యాదికొచ్చి అడిగినాను.

రెండో: మీయింటోడి పేరేటి, పిల్లా ?

అచ్చి: (సిగ్గుతో ఊరుకొంటున్నది.)

అచ్చి: మామ మాయింటోడి పేరు చెప్పను.

రెండో: వోరే, మామంచి పిల్లరా; అలావుండాల అలుమగ-లంటే. అయితే, పిల్లా, యీడనొచ్చి వున్నారేటి? సుట్టుపక్క లోన్నెరూ నేరే! నీకు బయం నేదూ?

అచ్చి: నాకి త్తయ్యుంటే నాకేటి బయం?

ఒకడు: ఓహో, అదా నీయింటోడి పేరు?

అచ్చి: (సిగ్గుతో ఊరుకొంటున్నది.)

ఒకడు: (జ్ఞాపకము వచ్చినట్టు నటిస్తూ) ఏమేటి? కి త్తయ్యా? అడిపే రదేగదంటార్రి సెప్పినాడు?

రెండో: అవును, పాప మీపాటి కేమయుంటాడో! బతకొచ్చును,

అచ్చి: (భయముతో) వోరన్నా? యేం టంటున్నావు?

ఒకడు: పాపం, మేమొస్తావుంటే, నట్టేట్లో కిందా మీదా మునుగుతున్నాడు. పడవ బిరీని గడిపి, ఏట్లోకి నుమికి లోని కెక్కించినాము. కొనూపిరితో వున్నాడు. ఆడిని తీసుకపోయి యేటావల వూరిచావిడిలో యేసినాము. కడుపుమీదేసి తొక్కినాము. శానానీళ్లు బయటి కొచ్చేసినాయి. కొంచెం కళ్లు తెరిచినాడు. పేరడుగుతే 'కి-' అని మరి చెప్పనేకపోయినాడు. నీవూరేదంటే యీ

అచ్చి: ఆఁ! ఆఁ! నా కిత్తయ్యే; నాకిత్తయ్యే? నాకొంప ముంచేసినాడూ? అన్నా, నిజంగా నాకిత్తయ్యేనా?

రెండో: నీకిత్తయ్యో, యాకిత్తయ్యో, మాకెట్లా తెలుస్తాది.

అచ్చి: సూడూ, సామనసాయగా వుంటాడు గందా?

ఒకడు: అవును, కొంచెమలాగే వుంటాడు.

అచ్చి: సూనూగు మీసాలుంటాయిగందా?

రెండో: అవునవును. తుమ్మెదలలాగ న...ల్లగున్నాయి.

అచ్చి: సూడ స...క్కని మొవము గందా?

ఒకడు: అసక్కదనం నీకే తెలియాల.

అచ్చి: నీకంటా కసింత పొడుగ్గుంటాడుగదా?

ఒకడు: కొంచెం నాయెత్తే.

అచ్చి: దండలు తిరిగుంటాయి

రెండో: వో! మంచి బలంకలోడే. అంమశాతే అంతసేపు నీట్లో యీదినాడు. పాప మాఖరి కలిసిపోనాడు. యేం సేస్తాడు?

అచ్చి: నాకిత్తయ్యలా నీటిలోకి దిగడే! నామీ దొట్టేసుకొన్నాడే, దిగనని!

ఒకడు: ఆవు నీటిలో దిగొడ్డాదంట. దానికోసం అడున్ను దిగినాడు.

అచ్చి: అన్నా! అన్నా! సూడు! నాకిత్తయ్యకి కుడిబుగ్గ-మద్దెని పుట్టుమచ్చ సూసినావా?

రెండో: అయ్యో, పాపం దీని మొగుడేనురా!

అచ్చి: పుట్టు మచ్చుందీ? నాకిత్తయ్యో! నాకిత్తయ్యో! మామోయి, మామా! నాబతుకు కద్వాన్నం చేసినావురో! మామోయి, మామ! నన్నేడకు పొమ్మన్నావురో. మామా! నన్నోరి కొప్పిసెప్పినావురో, మామా, నా మామా!

ఒకడు: ఎందుకేడుస్తావు, పిల్లా? బతికుంటే ఆడేవొస్తాడు.

అచ్చి: నాపానాలుండవురో, నా మామా! నీ మొగమేదిగో, నా మామా! మరినాకు కనబడవా, నా మామా, నానుకూడా సచ్చిపోతానురో, నా మామ!

రెండో: యిదేటి పిల్లా, యిలా అపశకునంగా యేడుస్తావు? బతికే వుంటాడులే.

అచ్చి: బతికుంటాడా? అన్నా, నన్ను నాకిత్తయ్యకాడకు దిగబెట్టరూ? యీ పున్నెం కట్టుకోరూ? యిదుగో, యీతోట, యీయిల్లు, యీయావులు, యీదూడలు,

అన్నీ మీకే యిచ్చేస్తా. నాకిత్తయ్యని నాకు సూపిం-
చండన్నా! మీ మేలు మరిసిపోను, నాయన్నా!

ఒకడు: ఇదేటిరా, యీగొడవ తెచ్చిపెట్టుకొన్నాము?

రెండో: పోనీలే. పాపం. ఈళ్ళిద్దరినీ చేర్చేసే పోదాము. ఊరికే కొట్టుకొంటున్నాది. మనకి పొద్దోతే పోయింది. నువ్వు ముందరపో. పడవని నీటిలోని కీడ్చివుంచు. నా వెనక నించి యీపిల్లని తీసుకొస్తాను.

ఒకడు: నువ్వేపో, నానేతీసుకొస్తాను.

రెండో: ఆపిల్లకి బయమేస్తాది. ఇద్దరమూ తీసుక పోదాములే. ఏం పిల్లా, గుడిసె వాకిలేసుకో; యేమేమి చూసు-కోవాలో చూసుకో.

అచ్చి: నాకేమీ, అక్కర్లేదన్నా! నాకేమీ అక్కర్లేదు. ఓరీని పదండి.

ఒకడు: అయితే రా, మరి.

అచ్చి: నా మామో, నా మామ!

(పోతారు.)

## రంగము ౪.

[తుంగభద్రి ఒడ్డు. గుడిసెముందు. కిత్తయ్య ప్రవేశము.]

కిత్త: యేం, సెవ్మ్రా, అచ్చి యీడినం యెదరగా రాలేదు! ఇంట్లో యాదో పని సేసుకొంటున్నాది కాబోలు. యాదో యింద సెయ్యాల ననుకోనుంటాది. దానికి తెలకుండా యెళ్ళి కళ్లుమూస్తా. (చప్పుడు సెయ్యకుండా నడుస్తున్నాడు. తొంగిచూచి)—యింట్లో నేదే! యాడనో దాంగోనుంటాది, నన్ను బయంపెట్టడానికి... తెలిసిందిలే అచ్చీ, తెలిసిందిలే. వాకిలోరని దాంగున్నావో! రా, బయటికిరా. (పోయిచూస్తాడు.) ఈడ నేదే! ఓహో, మంచంకిందనో! (చూస్తాడు) అరే! యింట్లో లేనట్టే...సుట్టుపక్కలెక్కడా కనబడనేదే! మద్దేన్నం కూడా కూడొట్టుకు రాలేదు. ఏటిగ్గానా పోయిందా? యేటొడ్డునుంచే వొచ్చినానే!—నేను, నేను, యీడనె యాడనో వుంటాది...అచ్చీ! అచ్చీ!...పలకనేదు. ఆఁ! అమగమగో నాయచ్చి! (పోయి చూస్తాడు.) అయ్యో, యాదో తీగ...అచ్చీ! యాడకుపోయినా వచ్చీ!... ఆదిగో పలుకుతున్నది (చెవి ఒగ్గి విని) యాదో పచ్చి... అరుస్తున్నాది...అచ్చీ! పలుకవే మచ్చీ! నన్నేంచు కాడిస్తావే, నాయచ్చీ! బిరీనిరా...ఏం, రావేం? నామీద

కోపమొచ్చిందా? నానేం టన్నాను? (క్రిందికిచూచి) ఈడనేవో కొత్తఅడుగులు కనబడుతున్నాయి. వోరయి_నా వొచ్చినారో యీడకి? ఆరడుగులు ...వోరయినా తీసుకుపోలేరు గద, నాయచ్చిని? గుండెల్లో దిగులౌడుతున్నాదే! యేంటీ యెడమకన్నదరడం? నాకొంప కూలిపోయె! నాబతుకంతా గంగలో కలిసిపోయె! నాయచ్చి నన్నిడిచిపోయె!

ఎగిఱపోయెరా - చిలక _ యెగిరిపోయెరా _ గూడు
సిన్నబోయెరా _ దాని _ సిన్నెలేమరా.

చిట్టి - పలుకుల చిలక
చిన్ని _ వన్నెల చిలక
కన్నుల కరువైన చిలక
కళ్లలోను దుమ్ముగొట్టి.....యెగిరి
మంచి మంచి _ మాటసెప్పి
మాటలకే _ మురుపువొచ్చె
మరిచివుంటే - మాయసేసి
మాటయినా - సెప్పకుండ...యెగిరి

నాయచ్చి నన్ను మోసంసేస్తాదా? నాను నమ్మను. యాదో జరిగుండాల. యీ అడుగులజాడ పట్టిపోతే సంగతేదో తెలుస్తాది. యీడ నీతివులకీ దూడలకీ దేవరే దిక్కు_.

రచ్చించుకోవమ్మ — వోతుంగబద్రిమ్మ —
రచ్చించుకొని వుండవమ్మా

పచ్చికబయల్లోన — పారాడుతుంటాయి —
బద్రిమ్మ అవి బద్రిమమ్మా.

బోడావు — నల్లావు — బక్కావు — లక్కావు
చూడితో వున్నాయె తల్లీ !

దూడనేసే యేళ — తొందరలు లేకుండ
సూడు నీవే దిక్కు సుమ్మా.

(పోతాడు).

## రంగము 7

[బెజవాడ వీధి. కొంతమంది జెండాలు పట్టుకొని పాటపాడుతూ పోతూ ఉంటారు. ఒకడు పాడుతూ వుంటే, వెనుక తక్కినవాళ్లు పాడుతూ ఉంటారు.]

దీనులమయ్యా - దీనులము
దిక్కులేని నిరు - పేదలము
ఎండల మలమల - మెండెదము
వానల వడవడ - వడకెదము
మన్ని రొంపిలో - దొరలెదము
విత్తి ధాన్యముల - నెత్తెదము
క్షామంబుల పా - దాలసన్నిధిని
గడగడమని అ - ర్పించెదము
పండించుటకు - బాధ్యులము
తినుటకె మేమతి - దీనులము
దీనులమయ్యా - దీనులము
దిక్కులేని నిరు - పేదలము
గనులను త్రివ్వగ - గడగెదము
అడుగున బడి క - ష్టించెదము
మణులను బయటికి - తీసెదము
రాజుల శిరముల - చేర్చెదము

రాజుల గుత్తలు చెల్లించుటకు ని-
రాటంకముగా - బాధ్యులము
గుత్తలు కట్టెడి - తోత్తులము
మాటాడగ నతి - దీనులము.

[కిత్తయ్య ప్రవేశము.]

కిత్తయ్య: నాయచ్చి నెనుకొ్కంటూ యీవూరు సేరుకొన్నాను. ఆనాడు సూసిన పడవమీదోళ్లప నే అయి వుంటాది. యీడనయినా కనబడతాదో, నేదో!

ఒకడు: ఎవరక్కడ, నిలబడు.

కిత్త: మీరోరు? నన్నేల నిలబడమంటూరు?

ఒకడు: నువ్వెవరు?

కిత్త: (తనలో) నాఅచ్చిసంగ తీశ్శతో యేలచెప్పాల. (ప్రకాశముగా) నాను కూలోడిని. కూలి దొరుకుతాదేమో అని యీవూ రొచ్చినాను.

ఒకడు: యీవూళ్లో కూలిలేక మేమే యిలాగ తిరుగుతావుంటే నువ్వొకడివి చేరినావూ? మాతో చెప్పకుండా యీవూ రెందుకొచ్చినావు?

కిత్త: యీవూరు రాడానికక్కడా మీ ఆగ్గుండాలా? నాను తెలనేను.

ఒకడు: యీవూళ్ళో కూలోళ్ళంతా వొకకట్టు. ఆళ్ళ పెద్దలకి తెలనిదీ యెవరూ కూలిసెయ్యకూడ దీవూళ్ళో. నువ్వు యేరే కూలికిపోతే నీపానాలుండవు సూసుకో.

కిత్త: మీరు బతకా బతకరు, ఒకరిని బతకానివ్వరా? ఇదేటి అన్నాయం? మరి మీరే సూపించండి నాకు కూలి మీతోనే కలుస్తాను.

ఒకడు: అయితే రా, ఈజెంగా పట్టుకో.

కిత్త: ఈజెండాయేల? నాకు జెండాలసంగతి తెలసు. యేం మాటొస్తాదో, నాకక్కర లేదు మీకిష్టం నేక పోతే మరొకూరు పోతాను.

ఒకడు: హేయ్! మాట్లాడొద్దు! పట్టుకో, నడు. యెనకనుంటే పారిపోతావేమో; ముందునడు. మాము పాడినపాట నువ్వున్ను పాడతావుండు.

కిత్త: (తనలో) యిదేటి దేవుడా! నాయచ్చికోసం నా నెను కొక్కుంటావుంటే, యీళ్ళ సేతుల్లో పడ్డాను! కాని. యేమయితే అదవుతాది.

(అందరున్ను మునుపటివలె పాడుతారు.)

దీనులమయ్యా – దీనులము
దిక్కులేని – నిరుపేదలము

మట్టిని అచ్చున - పోసెదము
ఇట్టికబట్టీల్ - పెట్టెదము
మహాలులు మహాడీల్ - కట్టెదము
ధనవంతులకవి - తార్చెదము
కుములుచు మురియుచు - కూర్చుండే ఆ
యయ్యల కడియేన్ - దాసులము.
మహాడీల్ కట్టగ - మాన్యులము
తిరుగాడగ నతి - దీనులము.

దీనులమయ్యా - దీనులము
దిక్కులేని నిరు - పేదలము.

పట్టు నూలులను - వడకెదము
నిగ్గుల బట్టల - నేసెదము
ధనికుల కడకును - చేర్చెదము
వన్నెల మస్తు ల - మర్చెదము
సొక్కుచు సోలుచు - చూచేఅయ్యల
పాదములనుబడి - పట్టెదము
బట్టల నేయగ - ప్రబలులము
బట్టలు గట్టగ - బడుగులము.

[పోలీసులు ప్రవేశము]

పోలీసు: ఎయ్, నిలబడండి.

ఒకడు: మేము నిలబడేది లేదు. ఈబాట నీదా? నువ్వెవ్వరు మమ్మలి నక్డపెట్టడానికి?

పోలీసు: నేనెవరా? తెలిపిస్తానుండు. నీ పేరు?

ఒకడు: యింతమంం నుంటావుంటే నాపేరే యేల చెప్పాల? అసలు మాపేరడగడానికి నువ్వెవ్వరు?

పోలీసు: ఏ, జవాన్, ఎయ్, ఈడికి బేడీలెయ్.

(వెనకవాళ్ళందరూ పారిపోతున్నారు.)

ఒకడు: పోలీసయ్యా, ఈడు (కిత్తయ్యను చూపి) రమ్మంటే వొచ్చినాము. మాకేమీ తెలను.

పోలీసు: ఎవడీడు? కొత్తమొగంలావుందే. ఎయ్యండి బేడీ లీడికికూడా.

కిత్త: ఏంరా, యిలాసెప్తావు? నామాన నాను పోతావుంటే నన్ను బయంపెట్టి, సేతులో యీజెండాయెట్టి ముందుకు తోసి, మళ్ళీ నామీద పెడతావా? యెంతన్యాయంకాలమొచ్చింది!

ఒకడు: ఈడేనయ్యో. యీడే (పారిపోతున్నారు)

పోలీసు: పట్టుకోండి, పట్టుకోండి (కొందరు పోలీసులు వాని వెంట పరుగెత్తుతారు.) నువ్వు నడు, ఠేసనికి నడు.

కిత్త: పోలీసప్పా, నన్నెందుకిట్లా సేస్తావు? నా కేకర్మమూ తెలదప్పా. నా నీదినమే యీవూరొచ్చినాను. యీ ళ్ళోళ్ళో నన్ను సంపుతామని బయపెట్టి, యీజెండా నాసేతులో పెట్టినారప్పా !

పోలీసు: ఎయ్, మట్లాడకు. తిన్నగానడు. నువ్వోళ్ళకి మొనగాడివి.

కిత్త: లేదప్పా, నాయచ్చి నెమక్కొంటా వస్తుంటే, యీళ్ళెగు రుపడ్డారు.

పోలీసు: నీ యచ్చెవరు ?

కిత్త: నాముద్దులచ్చి, నాపాటలచ్చి, నాకు కనబడకుండా పోనాది.

పోలీసు: ఆచ్చో, బుచ్చో! యీకదలన్ని కట్టిపెట్టి. నడు. ఠేసను కాడే అంతా సెప్పుదువు గాని.

కిత్త:

గ్రాచారమోరు త - ప్పిస్తారురా - నుదుటి
రాత నెవ్వరు తుడి - సేస్తారురా.

తల్లిదండ్రుల నిడిచి - తనవారిని యిడిచి
తరవాత యేమౌనో - తల సంగతేసైతి గ్రాచార.

అచ్చె నాలోకమని - అచ్చంగ నమ్మికొని
మెచ్చి చేరదీస్తి - వొచ్చెః గతినాకు గ్రాచార.

కొంప కూలిపోయె - గొడ్డు గోదలుపోయె
కొసకి పోలీసోళ్ళు - కొట్లాతోస్తున్నారు. గాసిచార.

పోలీసు: ఒరే, యేం నడవవు ? మడ్డుపోటుకావాలా ?

కెత్త: పదండప్పా, పదండి. (పోతారు.)

తెర.

రంగము ౬.

(బెజవాడ వీధి— ఇద్దరు పడవవాళ్లు, అచ్చి, ప్రవేశము.)

అచ్చి: నీ తలకొట్టిపోను! నీ యమ్మకడుపు కాల! నన్నేడ కిరా తీసుకొచ్చినారు?

ఒకడు: ఎయ్, నోరుముయ్, గట్టిగా అర్సినావంటే నోరు నొక్కేస్తాం.

అచ్చి: మీకడుపులో అగ్గొయ్యా! మీమచ్చమానిపోను! మీ యిల్లు కూలిపోను! నానోరు నొక్కుతారా? ఓరురా మీరు? దొంగగాడి దల్లారా! కిత్తయ్యో, కిత్తయ్యా, మామోయ్, మామా! ఏడనున్నావురో! రావేమిరో! నా బతుకద్దాన్న మయిపోయెరో! నానోరు దిక్కులేరో!

రెండో: ఓపిల్లా, యినగో నామాటయినను. కేకలేస్తే మంచిపని కాదు. నీకూ మాకూకూడా ముప్పొస్తాది. యీమలో పోయే వోళ్ళంతా యిని సుట్టూ మూగుతారు.

అచ్చి: యింటేయిననీ, మూగుతే మూగనీ. అందరితో సెప్పేస్తా, మీరుసేసినపని. మీకొంపకి కొరివిని. మీపానాలమీది పిడుగుని. మిమ్మల్ని నాశనం సేసేస్తా. నాకిత్తయ్యకి తెలుస్తే మీకీభూమిమీద రుణంతీరిపోతాది. నామాట యినండి. నన్ను నాకిత్తయ్యకాడికి సేర్సియ్యండి.

B.R.R. P.U.C.

ఒకడు: ఇదుగో, అచ్చీ, నామాటింటావా, యినవా? నీకిత్త సచ్చిపోనాడు. మ రాడా శెట్టుకోను.

అచ్చి: నా కిత్తయ్య సచ్చిపోనాడా? మీగొంతుకలు కోరి కెయ్యా! ఆడిదెగ్గిరకి తీసుకుపోతామని మబ్బెపెట్టి, యీడకు తీసుకొత్తారా? మీనాలికలు తెగ్గొయ్యా! మీకళ్లు పేలిపోను! మీకొటిలో మూడువేటల బుగ్గి రెయ్యెత్తిం చెయ్యకుండా వూరుకొంటా ననుకొన్నారశాగ్రి?

రెండో: (నవ్వుతూ) రేమచ్చీ, యిదుగో!

అచ్చి: మీనవ్వు నాశనంగాను! మీపొగరణిగిపోను! మీకు పెళ్లాలు లేరంటాగ్రి? మీ కక్క సెల్లెళ్లు లేరంటాగ్రి?

ఒకడు: మవ్వే మాపెళ్లాం. మాబావకి నువ్వు సెల్లెలివి.

అచ్చి: మీనోరొడిపోను! మీసిగాదరగా! ఓకిత్తయ్యా. కిత్తయ్యా! రారో! యీళ్ళనుంచి నన్నుతప్పించుకోరో! యేడ నున్నావురో!

(పోలీసులు, కిత్తయ్య, ప్రవేశం.)

పోలీసు: నడు, నడు! దిక్కులు సూస్తావేం? పారిపోడానికా?

కిత్త: నాను పారిపోనప్పా! నాఅచ్చేపోయింది నాకీలోకంలో మతో రున్నారు? నడవండి—

పోవావె - నాయచ్చి - ముద్దుల - నాయచ్చి
పోనావా - యిడిసి - పోనావా - అచ్చి
రావా - నన్నేలు - కోవా

అచ్చి: ఓహో - కిత్తయ్యా - వోయసునా - కిత్తయ్యా
మాటసెప్పియెళ్ళి - పోరో - కిత్తయ్యా
రారో - యిడిపించు - కోరో.

కిత్త: తెల్లనా - కౌశాన - నల్లమ - బ్బొట్టింది
కళ్ళలో - మెరిసింది - కన్నరు - కమ్మింది
రాయే - నన్నప్పు - కోయే - నాయచ్చి.

అచ్చి: పారేటి - నీళ్లలో - పడవపో - తుండంగ
పడవోరిగి - పోయింది - రయ్యో - కిత్తయ్యా
యెడబాపు - వొచ్చింది - మనకో - కిత్తయ్యా.

కిత్త: నడిమింటి - సూర్యుణ్ణి - మిడినాగు - పట్టింది
మింటిలో - సీకట్లు - మించిపో - తున్నాయి
పోడాని - కేదారి - పాడగట్టు - కున్నాది
రా యే - నీచెయ్యి - యియ్యే - నాయచ్చి.

అచ్చి: కారడవి - లోపల - కన్నుగా - నకుండ
దారి త - ప్పిపోయె - దరిదాపు - లేదాయె
వోరు ది - క్కు - వుతారు - రయ్యో - కిత్తయ్యా
రారో - రచ్చించు - కోరో.

కిత్త: అదుగదుగదుగో, నాయచ్చి! (పోబోతున్నాడు.)

పోలీసు: హెయ్, నిలు, ఎటుపోతావు ?

అచ్చి: అదుగదుగో, నాకిత్తయ్య! (పోబోతున్నది.)

ఒకడు: హెయ్, నిలు, ఎటుపోతావు ;

కిత్త: అచ్చీ! అచ్చీ!

అచ్చి: కిత్తయ్య మామో! కిత్తయ్య మామ!

కిత్త: నన్ను నాయచ్చికాడకు పోనియ్యండి.

పోలీసు: పోడాని కీలులేదు. నడు.

అచ్చి: నాను నాకిత్తయ్య కాడకు పోతాను. పోండే, నా కాడకు రాకండి.

రెండో: పోదువుగాని, పాపం! మాబంగార మేడదాసినావో ముందుసెప్పు.

అచ్చి: మీబంగార మేటది!

ఒకడు: మాపడవలో సెట్టుకొన్నది నువ్వేతీసినావు. ముందదీస పెట్టిపో. సేకపోతే పోలీసోళ్ళ కొప్పజెప్తాం.

అచ్చి: మిమ్మల్నే నానొప్పజెప్తాను. మీనాలికొడిపోను! నన్ను మోసంసేసి, నానా అల్లరాపెట్టి, నాకు దొంగతనం

కూడా కడతారంటూరి? వో పోలీసప్పో! పోలీసప్పా! సూడప్పా, యీళ్ళెలా సేస్తున్నారో!

పోలీసు; ఎవరురా, ఆళ్ళు? ఆడదాన్నలా అల్లర పెడుతున్నారేటి?

ఒకడు: మామేమీ సెయ్యడంలేదు. అయమ్మే మమ్మల్ని నల్లర పెడుతున్నాది.

రెండో: సూడప్పా, పోలీసూ, మాపడవెక్కి, కేవియ్యకుండా, సల్లంగా దిగిపోయింది. మాము పడవలో సెట్టుకున్న బంగార మేడనో దాచీసింది. నువ్వాయిసా యిప్పించియ్యాప్పా!

పోలీసు: ఓపిల్లా, ఆళ్ళకేవ్వు, ఆళ్ళ బంగారమూనంటు, ఆళ్ళకిచ్చెయ్. ఆడదానివి కావూ? జెయిలుకి పోవాల నుస్నావేటి నీకున్న?

అచ్చి: సూసినావా, మామా, యీళ్ళెంతవా దేస్తున్నారో?

కిత్తయ్య: ఏమచ్చీ. నువ్వు దొంగతనం సేసినావంట నే?

అచ్చి: బూదేవి సాచ్చిగా, మామా, నా సేపాపమూ ఎరగను. ఈళ్ళు నన్ను మోసంసేసి, మనిద్దరికీ యెడబాపులు సేసినారు, మామా!

ఒకడు: ఎయ్, అబద్దాలాడతావా? "కిత్తయ్యతో సాను పడలేకుండావున్నాను. నన్ను బందరు దిగెట్టియ్యండి" అని మాపడవెక్కనేదూ? ఇక్కడికొచ్చినతరువాత, మాకే

వియ్యాకుండా, మాబంగార మంతా యాడనో వొచ్చీసి, అడు కనబడగానే దొంగేడుపు లేడుస్తావా ?

కిత్త: అవునా, అచ్చీ ? నానునీకు నేదయిపోనానో ! పో, పో, ఆళ్ళతో నేపో.

అచ్చి: మామా, యీదొంగ నాయాళ్ళమాట నమ్మతున్నావా ? మీకూటిలో మన్నుపడ! మీకోటి కగ్గట్టా! దేమట్రి, పేలినారు ?

పోలీసు: ఎయ్, బాటలో అల్లరసేస్తున్నారు. మిమ్మలి నందరిని అరెస్టు సేసినాను. నడవండి. స్టేషనికి.

రెండో: మామేమి సేసినామప్పా, మమ్మలిని నడమంటావు ?

పోలీసు: మీ అందరికి ఏదోసంబంధముంది. అంతా కోర్టులోనే తెలస్తాది పదండి.

అచ్చి: పదండి, నాకు భయంనేమ. నానూ, నాకిత్తయ్యా కలిసి నడుస్తాము. ఈళ్ళ నెరేవుంచు, పోలీసప్పా.

ఒకడు: మాకు మాత్రిం బయమా ? నడు. కాని, పోలీసూ, అల్లిద్దరూ దగ్గరగుంటే మాట్లాడుకుంటారు. ఆళ్ళని కలియనియ్యకు.

పోలీసు: సరే, ఓపిల్లా, నువ్వాళ్ళదగ్గరా ఉండకు, ఈడిదగ్గరా ఉండకు. నాయెనకనుండు. నడు. (పోతారు.)

తెర.

రంగము 2.

(బెజవాడ మేజిస్ట్రీటు కోర్టు. మేజిస్ట్రీటు, వకీళ్ళు, కూర్చొని ఉంటారు. గుమాస్తా మేజిస్ట్రీటు ప్రక్క నిలుచొని ఉంటాడు. పోలీసు కాన్స్టేబిలు, కిత్తయ్యను, అచ్చిని, పడవవాళ్ళను తీసుకొని ప్రవేశిస్తాడు.)

మేజి: ఎవరోయి, పోలీసు, ముద్దాయీలను బోనులోని కెక్కించు.

పోలీసు: పదండి, దానిలోని కెక్కండి. (ఎక్కుతున్నారు. వాళ్ళ ప్రక్కను పోలీసు నిలబడుతున్నాడు.)

కిత్త: అచ్చీ, యీపక్కకిరా, (అచ్చి వస్తున్నది.)

పడ: ఒకడు: దేవరా, ఆళ్ళిద్దరూ ఒకసోట వుండగూడదు. మాట్లాడు కొంటారు.

మేజి: సరే, వేరేవేరే ఉండండి.

అచ్చి: ఏం, దేవరా, మాకు న్యాయ మివ్వవా ? యిప్పుడే మ-మ్మ ల్నెడము సేసేస్తున్నావే !

గుమా: ఓ అమ్మీ, 'దేవరా' అనకూడదు. తప్పు. 'బాబయ్యా' అనాలి, లేకపోతే 'మహాప్రభో' అనాలి. 'దేవరా' అంటే ఘనమైన కోర్టువారి నవమానించిన ట్టవుతుంది.

అచ్చి: అదేమిగోలో. మామట్లాగే అనేది. గనమో, గినమో, మామ పలకనేము, అంతింతమాటలు.— ఓయప్పో, నన్నుమాత్రిం 'అమ్మో' అనబోక. తరవాత మాటొస్తాది.

మేజ: ఏమే, తిన్నగా మాట్లాడలేవూ?

అచ్చి: దేవరా, నువ్వు గొప్పోడివయితే అయినావుగాని, నన్ను 'ఏమే' అనిమాత్రిం పిలక! నానేమి నీపెళ్ళాన్ననూ కొన్నవా?

మేజ: ఏమని పిలవాలి?

అచ్చి: 'ఏమమ్మో' అనాల.

మేజ: సరే, నీపేరేమిటి?

అచ్చి మాపేరలా సెప్పుకోము. కిత్తయ్య నడగండి, సెప్తాడు.

మేజ: దానిపేరేమిరా?

కిత్త: 'రా' అనకు, దేవరా. అట్లంటే మాకుతప్పు.

మేజ: బాగుంది. నిన్నేమనాలి?

కిత్త: 'ఏమప్పా' అనాల.

మేజ: నువ్వాడవాడవా. 'అప్పా' అనడానికి?

కిత్త: యీదేశంలో అప్పలందరూ ఆడోళ్ళుగావాల. మా దేశంలో అప్పలు మొగోళ్ళే.

మేజి: నీదేవూ రప్పా?

కిత్త: మాది రుద్రింపేట.

మేజి: ఎక్కడుంది, అరుద్రింపేట?

కిత్త: యింత సమవుకోనోళ్ళు, రుద్రింపేట యాడనుందో తెలదా?

మేజి: యేజిల్లా? యే తాలూకా?

కిత్త యావ జెల్లావో, యావతోలుకావో! మీకే తెలకపోతే, సమవుకోనోడని నాకెలా తెలుస్తాది?

మేజి: ఓయి, పోలీస్, అవూ రెక్కడుందో కనుక్కోని చెప్పు.

పోలీ: చిత్తం.

మేజి: నీ పేరు?

కిత్త: కిత్తయ్య.

మేజి: నీతండ్రి పేరు.

కిత్త: వోబలేసు.

మేజి: ఏం, హాస్యంచేస్తున్నావా? కోర్టువారి ధిక్కారం క్రింద నిన్ను ప్రాసిక్యూషణ్ చేస్తాను చూడు.

కిత్త: ఏమచ్చి, ఆయ ప్పలా కోపంసేస్తాడేల?

పోలీ: ఎయ్, మీరలా మట్లాడుకో కూడదు.

అచ్చి: పోలీసో, ఆయచెప్పే టంటాడో మాకు తెలనేదు. కస్సు బుస్సు మంటున్నాడు. గిక్కారు మంటాడు! పిసికేస నంటాడు! అర్ధంకానేదు.

మేజి: నీతండ్రి పేరేమిటో నిజంగా చెప్పు.

కి త్త: వోబలేసని సెప్పినాను కానా? మరోడికో పుట్టినానని చెప్పమంటావా యేటి? యిది బాగుందే!

మేజి: నువ్వబద్ధ మాడుతున్నావు. వోబలేసని యెక్కడనయినా పేరుంటుందా?

కి త్త: వుండదో? మావూరొస్తే యెంతోమంది కనబడతారు వోబలేసులు, వోబయ్యలు, వోబన్నలు.

ఒక వకీలు: ఆదేశములో అటువంటి పేళ్లుండవచ్చును. ఘనమైన కోర్టువారు నమ్మకపోవడానికి కారణం కనబడదు.

మేజి: సరే.—ఓయమ్మా!

అచ్చి: అనుగో, మరీ అదేమాట!

మేజి: ఓ యమ్మా, నీపేరేమిటి?

త్త: దానిపే రచ్చి.

మేజి: సరే. నీభర్త పేరు?

అచ్చి: బరతంటే?

పోలీ: నీ యింటోడి పేరు,

అచ్చి: (కిత్తయ్యవైపు చూస్తుంది.)

మేజి: ఓహో, వాడేనా నీభర్త?

అచ్చి: వాడూ!

మేజి: అయితేనా?

కిత్త: అవును, నానే దానింటోడిని.

పల్లి: కిత్తయ్య అబద్ధమాడుతున్నాడు. వాడు దీనిభర్తకాడు.

అచ్చి: వోరలా అనేది?

మేజి: ఇది ఒక ఇస్యూగా చేర్చమంటారా?

పల్లి: చిత్తము.

మేజి: సరే.—(ఒక పడవవానితో) నీపేరు?

1 పడ: మొరెడ్డి.

మేజి: ఇదేమిపేరబ్బా! సరే, నీతండ్రిపేరు?

1 పడ: బయ్యాప్పరెడ్డి.

మేజి: (రెండోపడవవానితో) నీపేరు?

2 పడ: కొటయ్య.

మేజి: ఇదేమి వేళాకోళ మనుకొన్నావా? ఎవరినికొట్టమంటావు?

2 పడ: అయ్యో, నాపేరే అది. దేవరా!

మేజి: బాగుంది. తండ్రి పేరు?

2 పడ: చిక్కన్న

మేజి: చిక్కగా నేవుంది, యీపేరు,—మీమీది ఛార్జీలను చెప్పు-తాను, వినండి.—కిత్తయ్యా, నువ్వు కమ్యూనిస్టులతోచేరి, జెండాపట్టుకొని, డిమాన్స్ట్రేషను చేస్తూ, యీ పూళ్ళోని ధనవంతుల యిళ్లమీదపడి, దోచుకొనే ఉద్దేశముతో కాన్స్పిరసీ చేసిన అన్లాఫుల్—ఎసెంబ్లీలోచేరి, పోలీసు వారు చెదరిపొమ్మని ఆగ్గరుచేసినా పోక, చక్రవర్తిగారి న్యాయచట్టము నతిక్రమించినావని పోలీసువారు నీమీద కేసు తెచ్చినారు. ఆ నేరము చేసినావా?

కిత్త: నువ్వనేమాట నాకేమీ తెలవలేదండీ.—పోలీసూ, యేటిదంతా? కమ్మింటంటు, దిం దిం అంటు, ఆడోరంటు, కంచిపెసరంటు, అల్లం బెల్లమంటు, రయ్యిం గోల తెచ్చి-పెట్టినా వప్పా!

మేజి: ఏమండీ, పబ్లిక్ ప్రాసిక్యూటరుగారూ, వీనికి కేసు స్వభావము తెలియజెప్పండి.

పల్లి: ఓ కిత్తయ్యా, నువ్వు తర్డ్ ఇంటర్నేషనలుకు చేరినవాడవు గదా?

కిత్త: తా డింటనే సాలంటూరా? నాకబోకపద్దం సేసు.

పల్లి: ఎయ్, వెంకెషూటలాడకు. నువ్వీదేశములో బోల్షివిక్ ప్రోపెగేండా చేయతలపెట్టినావా, లేనా?

కిత్త: బోడిసెవులేటో, పార్గొడేటో, నాకే.. విూ తెలసు.

అచ్చి: నా కేందారి మామో! నిన్ను జోడిసేసేస్తారంట పోరప్పకొండకు సేరుస్తారంట. ఆ కొండేడనుందో? నువ్వేమి సేసినావు. మామా? నిన్నూ నన్నూ యిడదీసేస్తారు గాబోల, మామో!

మేజి: పోలీస్, దానిని మాట్లాడవద్దని చెప్పు.

అచ్చి: 'దానిని'! సుతి మించిపోతున్నాదే!

పల్లి: ఘనమైన కోర్టువారు వీనిముఖమై ఖరిని కనిపెట్టవలెను. వీడేమీ తెలియనట్లు నటిస్తున్నాడు

మేజి: చూస్తున్నాము,—కిత్తయ్యా, నీపక్షాన్ని వకీలు నెవరినైనా పెట్టుకొన్నావా? నువ్వే వాదించుకొంటావా?

కిత్త: అంతింత పెద్దమాటలాడినాడు, అయప్ప వాకీలుకాడా? అయన్నే వాదించమనండి.

మేజి: ఆయన ప్రాసిక్యూషన్ తరఫున వాదిస్తారు. డిఫెన్సుకు నువ్వు వకీలు నేర్పాటుచేసుకో. చేసుకోకపోతే, నువ్వే వాదించుకోవాలి.

కిత్త: పొక్రిసిక్యూ సేటో, డిప్పినే సేటో! వోదమంటే నాకు బయం. వోడిస్తే అదేటి సిక్కులొస్తాయో!

మేజి: సరే, మేమే ఎపాయింటు చేస్తాము. శ్రీనివాసరాఘవయ్యంగారు గారూ, మీరుకిత్తయ్య పక్షాన్ని వాదిస్తారా?

శ్రీ. రా అ: ఎనక్కు ఫీజు పోనరబిళ్ కోర్టువర్ వేరుప్పాడు సెయ్యవాల.

మేజి: సరే, కేసు మొత్తంమీద రు. 5 లు ఏర్పాటు చేసినాము.

శ్రీ. రా. అ: నాస్టేటస్ ఆలోసిచ్చినాగళ్ కారే. ఎంతెంత లా-పాయింటుగళ్ వేణుమ్! ఎన్నా కదెయ్!

మేజి: మీకక్కరలేదా? మరెవరికైనా యేర్పాటు చేస్తాము లెండి.—వకీల్లుగారూ, మీలో ఎవరికైనా యీ కేసులో వకాల్తా కావలిస్తే, వ్రాతమూలకముగా తెలియజేసుకో వచ్చును.

[వకీల్లు చీట్లువ్రాసి మేజిస్ట్రేటు కిస్తారు.]

మేజి: చూచినారా, శ్రీనివాస రాఘువయ్యంగార్ గారూ, నిష్కారణంగా రు. 5ల ఫీజు పోగొట్టుకొన్నారు. నేను

చెప్పగానే ఒప్పుకొని ఉంటే యెంత బాగుండేది? హనుమంతప్పగారు రూ. 4 లకే చేస్తామన్నారు.— ఇదెవరి దీ-చీటి? జగన్నాథంపంతులుగారు,— రు 2-5-4 లకే చేస్తారట. వీరెవరో?—రాధానాథన్ గారు. (చదువుతున్నాడు.) "ఈకేసు ఇంటర్నేషనల్ ఇంపార్టెన్సు కలది. కమ్యూనిజం, కమ్యూనాలిజం; బోల్షివిజం, బోల్త్రాయిజం; బహుమూరిజం, బలాదూరిజం; డూ-ఆర్-డై ఇజం, యస్-యువర్-ఆనరిజం;- మొదలయిన యెన్నో సమస్యలతో కూడుకొనిఉన్నది. ఇంత ముఖ్యమైన కేసులో పనిచెయ్యడమే యెంతో గౌరవము. ఇటువంటి విషయములో కాంగ్రెస్ సెక్రెటరీగాఉండిన నేను ఫీజుపుచ్చుకొని పనిచేయడము కంటె అవమాన ముండదు. హానరబిల్ కోర్టువారు అనుగ్రహిస్తే నేనూరకే పనిచేయడాని కంగీకరిస్తున్నాను. ఇన్నాళ్లున్ను తమకోర్టులో ఒక్క కేసుకూడా పట్టివుండలేను. నే నీ ఊళ్లో పుట్టి, ఈఊళ్లో పెరిగి, ఈఊళ్లో చదివి ప్యాసయి, యీ ఊళ్లోనే బల్లకట్టుకొని, యీకోర్టునే కనిపెట్టుకొని ఉన్నాను. కాబట్టి. యీకేసు నాకే యిప్పించవలెనని ప్రార్థిస్తున్నాను. తమ అనుగ్రహమువల్ల ఈ కేసు గెలుచుకొంటే, నా పేరు ఋషికుల్య నుంచి పినాకిని వరకున్ను, బందరునుంచి బళ్లారివరకున్ను మోగిపోతుంది."

శ్రీ. రా. అ: ఈ కేజు రాధానాథన్‌గారి కొప్ప చెప్పుకున్నాడాము. ఆయన కాంగ్రెస్ సెక్రెటరీనని తానే కొన్నేన్దా. అవును క్కొవ్వడం గవర్నమెంటు పాలిసీకి విరుత్తం.

మేజి: ఆయన యెన్నడో కాంగ్రెస్ సెక్రెటరీగా ఉండేవాడు. ఇప్పుడు లేదుగా.

జగ: ఆయాన యేహో డబడబాయమానంగా నాలుగు 'ఇజం' లను విసిరేసేసరికి. కోర్టువారు గుమ్మయి పోయినారు. వాటి అర్థమేమిటో సరిగ్గా చెప్పగలుగుతే ఆయనకే యివ్వ వచ్చును. యేమండీ, రాధానాథన్‌గారూ, కమ్యూని-నిజం కు, కమ్యూనాలిజం కు భేదమేమిటండీ ?

రాధా: నన్ను తాము క్రాసుచేస్తున్నారా? మీకు తెలియక అడుగుతున్నారా ?

జగ: తెలియకే అడుగుతున్నాను, చెప్పండి

రాధా: కమ్యూనిజం అంటే అందరున్ను కలిసి పంచుకోనేది. కొన్ని కో ఆపరేటివ్ సొసయిటీల డైరెక్టరవలె, కమ్యూ-నాలిజం అంటే అన్ని ఒక్కడే కబళించేసేది; ఎంత తక్కువ ఫీజులకయినా, అన్ని కేసులున్ను తామేపట్టి, ఇతర వకీళ్ళకు ఒక్కటిన్ని దక్కనివ్వనితమవలె. తెలి-సిందా, యిప్పుడు!— వీళ్లే మహా గొప్ప 'లా' చదువు కొన్నట్టు, మేము చదువుకోనట్టు!

హను: చాలా బాగా చెప్పినావోయ్, రాఘానాథన్ ! అలా తగులుతూ వుంటేనేగాని యిటువంటివాళ్ళను బుద్ధిరాదు. మనిద్దరం కలిసి యీకేసు వాదింతాము. నాకు కూడా ఫీజక్కరలేదు.

జగ: నాకుమాత్రం కావలెననా యేమిటి ? ఫీజు పుచ్చుకోక పోతే క్లయంట్లు యెదుట పలుచదనమనికాని, లేకపోతే ప్రొఫెషన్ మీద ఉన్న గౌరవం డబ్బుమీదనే ఉంటే, ఈపాటికి భాష్యంఅయ్యంగారంతటి వాడనయిఉండనూ ! సరే, నేనుకూడా మీకు సాయం చేస్తానులెండి.

హను: నేనుమాత్రం ఊరికేకూర్చొని యేమిచెయ్యాలి. పట్టండి నలుగురం నాలుగు కొమ్ములు మోసేదాం. కాని, పబ్లిక్ ప్రాసిక్యూటరుకు దినానికి రు. 35 లు, మేజిస్ట్రేటువారికి యధావిధిగా జీతం ముట్టుతవే, మనకేమీలేదే. అని మాత్రం నాకు కడుపుమంట. శ్రీనివాస రాఘవయ్యంగారు గారూ, మీరుమాత్ర మేమిచేస్తారు ? రండి మా పక్కకు. ఈకేసులో కాకపోతే మరొకదానిలో కోర్టు వారు ముట్టజెప్పిస్తారు లెండి. పబ్లిక్ ప్రాసిక్యూటరు గొప్పేమిటో, టకటకలాడించేదాము.

మేజి: పేదవాళ్ళ విషయములో మీ రింత ఉదారమైనబుద్ధి చూపడం, బెంచికి వారుకూడా గౌరవం. మీ రందరి

ముద్దాయీల పక్షాన్ని వాదిస్తారా?

రాధా: చిత్తం. మాలో మాకొభేద మేమిన్ని లేను.

మేజి: సరే, కేసు కానివ్వనా?

పల్లి: చిత్తం. కానివ్వండి

మేజి: రెండో ముద్దాయి, అచ్చమ్మా, విను. నువ్వు నీ భర్తను విడిచిపెట్టి, ఈపడవవాళ్ళతో బయలుదేరి, వాళ్ళకేవు యివ్వలేదని ఒకఛార్జి. వాళ్ళ పడవలో బంగారం దొంగిలించినావని రెండో ఛార్జి, ఏమంటావు?

అచ్చి: నాను నాకి త్తయ్యాని యిడిసిపెట్టనేను. నన్ను నాకి త్తయ్యా యిడిసిపెట్టనేను. ఈదొంగనాయాళ్లు నాకబద్దాలు సెప్పి, నీకి త్తయ్యని సూపిస్తామని, పడవెక్కించి, తిప్పితిప్పి యీవూరు తీసుకొచ్చినారు.

మేజి: వాళ్లకు నీవు కే విివ్వవలెనా? అక్కరలేదా?

అచ్చి: నా నేలివ్వాల? నానేమి నన్నిడకు తెమ్మన్నానా?

మేజి: వాళ్ళ బంగారం మాట?

అచ్చి: ఆళ్ళ మొవానికి బంగారం కూడాను. దొంగ కూతలు కూత్తున్నారు. ఆళ్లమీది కొత్తాదేమో అని అలాసెప్తారు.

మేజి: మొర్రెక్కీ! కొటల్రియ్యా! అచ్చమ్మ కబద్ధాలుచెప్పి,

లేవదీసుకొని వచ్చినారని మీమీద ఛార్జి. ఏమంటారు ?

మెంత్రి: అ .. య్య .. య్య .. య్యయ్యో ! మా మీదికే తిరిగిందే ! ఏమన్నాయ మేమన్నాయం ?

కొటయ్రి: మాకిదేటో తెలుసు, దేవరా. మాకేవు, మా బంగారం మాకిప్పించియ్యండి, దేవరా !

మేజి: అయితే, మీరా నేరం చేయలేదంటారు ?

కొటయ్రి: నేను, దేవరా ! సిసాచ్చిగా, దేవ్వుని సాచ్చిగా, నేను.

మేజి: సరే, ప్రాసిక్యూషను సాక్షులను పిలవండి. హాజరుగా ఉన్నారా ?

పబ్లి: ఈకేసు స్వభావాన్నిబట్టి దీనికి సాక్ష్యం దొరకడం కష్టం. కమ్యూనిస్టులు లోలోపల పనిచేస్తూ ఉంటారు. అనేక వేషాలు వేస్తూఉంటారు. ఈ కిత్తయ్యను, ఈ అచ్చిని చూడండి. ఎంత అమాయకంగా కనబడుతున్నారో ! వీరి చరిత్రి చాలా ఉన్నది. ఈ పోలీసు డయిరీలు ఎగ్జిబిట్లుగా దాఖల్ చేస్తున్నాను.

మేజి: ఈ డయిరీలవల్ల ఏమి తెలుస్తుంది ?

పబ్లి: ఈ కిత్తయ్య, ఈ అచ్చి, కమ్యూనిస్టుల గుంపులోనివారని తెలుస్తుంది. ఈ కేసులోని వివరములు బయలుపడితే, యిండియాలో ఈకమ్యూనిస్టు లెంత జాగ్రత్తగా, ఎంత

నేర్పుగా, ఎంత చాకచక్యముగా పని చేస్తున్నారో బయలుపడుతుంది. పోలీసువారికి తెలిసినంతమట్టుకు ఈ కిత్తయ్య అనేవాని అసలు పేరు కృష్ణమోహన్ బోస్. ఇతడు ఆయుదేంష్ట క్రిందట బంశిపోటు నేరముక్రింద కన్విక్టయి, డమ్‌డమ్ జెయిలులో ఉన్నాడు. ఒకనాటి రాత్రి అక్కడనుంచి తప్పించుకొని, సచ్చిదానందస్వామి అనే పేర సన్న్యాసిఅయి, ఇతర కమ్యూనిస్టులకు శిష్యుల వేషము వేసి, దేశములో తిరగడ మారంభించినాడు. ఈ సచ్చిదానంద స్వామిమీద కేసు పెట్టగా, క్రింది కోర్టులో కన్విక్షనయిందిగాని, హైకోర్టులో విడిచిపెట్టి-నారు. ఆతరువాత ఆస్వామిజాడ మరి కనబడడమే లేదు. తుదకు కిత్తయ్య అనేవేషముతో నేటికి పట్టుబడ్డాడు.

మేజి: చాలా హాశ్చర్యంగా వుందే యీకథ!

ప్లీ: అచ్చమ్మ అనేపేరుగల యీ రెండోముద్దాయికథ ఇంకా హాశ్చర్యమైనది. ఈమె మొదటిపేరు మిస్. సరస్వతీభాయి. ఈమెది బొంబాయిలోని గిర్గాం. ఈమె తండ్రి తిలక్ కాలములో సుప్రసిద్ధ రాజకీయ నాయకుడైన ఛట్నీవీస్. ఈమె భూలాబాత్‌ను పెండ్లాడినది. అతడు గవర్న-మెంటు ఉద్యోగి. ఈమెను తండ్రిసంప్రదాయము

వచ్చింది. భార్యాభర్తల కిద్దరికి పడలేదు. ఒకనాడు భర్తయింటినుంచి యీమెలేచి బొంబాయిలో స్టీమ-రెక్కి, రష్యా చేరుకొన్నది. అక్కడ బోల్షివిజములో తర్బీయతు పొందినది. ఐరోపామహాయుద్ధములో ఇంగ్లాండుచేరి, కమ్యూనిస్టు స్పయిగా మిస్. కెల్లర్ అనే పేర పనిచేసినది. యుద్ధమయిన తరువాత ఈదేశం వచ్చి, భర్తను కలుసుకొని, బోల్షివిజములో చేరవలసినదని ప్రేరేపించినది. ఆ భూలాబాత్ రాజభక్తితత్పరుడు గనుక ఒప్పుకోలేదు. అందుచేత అతనిని విడిచిపెట్టి, కిత్రయ్య అనే పేరుతో తుంగభద్రఒడ్డున గుడిసెవేసుకొని కాపురముచేస్తూఉన్న వీనిని కలుసుకొని కొన్నాళ్లున్నది. వీళ్లిద్దరున్ను కలిసి దేశములో అల్లరులు లేవదీయడానికి కుట్రచేస్తూ ఉండేవారు. ఈ సంగతి పోలీసులకు తెలిసి భూలాబాతున్ను, ఛోటాషహాబత్ అనే యీకాన్స్టే-బిలున్ను మారువేషములతో పంపినారు. ఈకొట్రయ్యే భూలాబాత్. ఈ మొర్రిడ్డే ఛోటాషహాబత్.

షే.జి: హాఁ! ఈకథ మరీ ఆశ్చర్యంగా ఉంది. అయితే ప్రాసిక్యూషనువారు అచ్చిమీద చేసిన కేసువ్యాకపోవడము, బంగారం దొంగిలించడము, అనేఛార్జీలను వదలుకొన్నా-రన్నమాట.

పబ్లి: ఇప్పటికి కోర్టువారా నేరములను గురించి విచారించ నక్కరలేదు. కాన్స్పిరసీఛార్జి తప్పిపోతే, ఆ నేరముల క్రింద ఛార్జి చేయవచ్చును.

మేజి: మొరెడ్డి, కోటిరెడ్యాలమీది ఛార్జిలనుకూడా వదలుకొన్నట్టే కదా? వాళ్ళని ప్రాసిక్యూషను పక్షమున సాక్షులుగా వేసుకొంటారా?

పబ్లి: చిత్తము. కోర్టువారు వాళ్ళిద్దరిని అప్రూవరుల క్రింద విడిచిపెట్టాలి.

మేజి: సరే, విడిచినాము. (వాళ్ళిద్దరు బోనులోనుంచి బయటికి వస్తారు) మొరెడ్డిని సాక్షిబోనులో ఎక్కించండి. (మొరెడ్డి సాక్షిబోనెక్కుతాడు.) క్లార్కు, ప్రమాణం చేయించు, (గుమాస్తా ప్రమాణం చేయిస్తాడు.) కానియ్యండి, ఫీజ్.

పబ్లి: మొరెడ్డీ, ఇక నువ్వు మొరెడ్డివి కావు. తెలిసిందా?

మొరె: నేను మొరెడ్డిని కానూ!

పబ్లి: నీ పేరు ఛోటాషహాబత్తు.

మొరె. మరేం?

రాఘా: కోర్టువారిట్టి లీడింగ్ ప్రశ్నల నడుగనివ్వకూడదు.

పల్లి: మధ్య మధ్య మీా రడ్డము రాకూడదు.

జగ: ఆమాట కోర్టువారితో మనవి చెయ్యండి.

పల్లి: (మొరార్జితో) నువ్వు కాన్‌స్టేబిలువి కదా!

హను: ఇదంతా వాని కింటివద్దనే నేర్పి తీసుకరావలసినది. కోర్టులో నేనా బోధచేయుడం!

పల్లి: హనుమంతప్పగారు రిస్పెక్టు పాయింటుసు పెట్టుకొని, ఈరీతిగా పలుకడం వింతగా ఉంది.—(మొరార్జితో) నీది బొం-బాయిలోని గిర్గాం,

మొరార్జి: అదే.

పల్లి: నువ్వీకిత్తయ్య నెక్కడచూచినావు?

మొరార్జి: (తనలో) మంచి చిక్కు తెచ్చిపెట్టినాడే! యేమని చెప్పాలో!

పల్లి: ఏమట్లా చూస్తావు? తుంగభద్ర ఒడ్డున చూచినావా!

మొరార్జి: అవును. మ రేడనూస్తాను?

రాధా: ఈయ నెక్కడ చూడమంటే అక్కడే చూడు.

పల్లి: అక్కడ ఈకిత్తయ్య, అచ్చి, ఆనేపేర్లుపెట్టుకొన్న వీళ్లేమి చేస్తున్నారు?

మొరార్జి: ఏం చేసారు? మాకు తెలుగా?

పబ్లి: నువ్వు వాళ్ళ మాటలు విన్నావా?

మొర్రి: వో! యినకేం? యింటూనే వున్నా.

పబ్లి: ఆమాటలన్నీ నీ డయిరీలో వ్రాసినావు కదూ?

మొర్రి: రాసినాను కానూ?

పబ్లి: కోర్టువారియెదుట పెట్టిన డయిరీలోని మాటలేనా అవి!

మొర్రి: నువ్వు సెప్పినట్టే.

పబ్లి: సరి.

మేజి: క్రాసు కానియ్యండి.

రాధా: నీ పేరు?

మొర్రి: మొర్రెడ్డి.

రాధా: మరేదో అని చెప్పిసావే?

మొర్రి: నా నేమీ సెప్పనేదే!

పబ్లి: ఫోటూషహాబత్.

మొర్రి: అవునవు నదే అయ్యప్ప సెప్పిందే.

జగ: ఏమి టా పేరు?

మొర: చోడాసత్.

పట్లి: ఛోటాషహాబత్తునడానికి 'ఛోడాసత్' అనేది సంక్షిప్తమైన పేరు. జగన్నాథరావుకు 'జగ్గు.' కృష్ణమూర్తికి 'కిట్టు', నరసింహావికి 'నరుసు', శ్రీనివాసానికి 'సీను' వలె.

హాను: మొరెడ్డీ, నిది తురకకులమా ?

మొరె: ఏమన్నా అంటే ఒప్పుకొంటానుగాని, నన్ను తురకోడంటే మాత్రము...

శ్రీ. రా. అ: అనాల్, శోడా శరబ్బత్ పెయర్ ఎన్న ?

మొరె: అదేటంటాడో! కీస బీస గోల.

జగ: నీ ఊరి పేరు ?

పట్లి: 'గిర్గాం' అని యింతకుముందే చెప్పినాడు.

హాను: మిమ్మలి నడుగలేను. ఛోటాషహాబత్తు నడుగుతున్నాను.

పట్లి: వాని తరఫున మేము చెప్పుతున్నాము.

జగ: అయితే, మీరే బోనెక్కి— ఛోటాషహాబత్తు కండి.—ఏం, మొరెడ్డీ, నువ్వు పాయ్యేసరికి కిత్త య్యెక్కడున్నాడు?

పట్లి: అడిగిన ప్రశ్నలే అడిగి కోర్టువారి కాలమును వృథాచేయ కూడదు.

జగ: నే నాప్రశ్న యింతకుముం దడుగలేను.

పటి: మీ రడుగకపోతే నే నడిగినానా. లేదా ?

జగ: ఏ సెక్షన్ ప్రకారం నే నడుగకూడదో చెప్పండి.

పబ్లి: ఎవిడెన్సు అక్టు 144 సెక్షను ప్రకారము.

జగ: ఆ సెక్షను వర్తించదు.

పబ్లి: ఇకముందు తమవద్ద లా నేర్చుకొంటాను లెండి.

రాధా: నీవు పోయేసరికి కిత్త య్యేక్కడున్నాడో కోర్టువారికి తెలియజెయ్యి.

మొర్రి: ఆవులు మేపుకొంటున్నాడు.

రాధా: ఇందాకా మాట్లాడుతూఉన్నా డన్నావే?

పబ్లి: ఆవులు తోలుతే మాట్లాడకూడదా? ఏమిప్రశ్నలయ్యా, ఇవి? చొప్పదంటు పశ్నలు!

రాధా: కొంచెం గౌరవంగా మాట్లాడండి.—అయితే, చోటా-హాజ్రీ, నువ్వు విన్నదంతా అడయరీలో వాృిసి నావుకదూ?

మొర్రి: రాసినానూ!

రాధా: నీకు వాృిత వచ్చునా?

మొర్రి: నో!

రాధా: (మేజిస్ట్రీటుతో) అడయిరీ ఖిలాదయవేయండి. (పుచ్చు-కొని, మొర్రిడ్డితో) ఏదీ, చదువు.

# అచ్చి — కాపువలపు

సెంత్రి: (చదువలేక దిక్కులు చూస్తున్నాడు.)

పబ్లి: వానికి వ్రాతవచ్చునన్నాడుగాని, చదువువచ్చునన్నాడా?

జగ: వ్రాయగలిగినవాడు చదువలేడూ?

పబ్లి: వ్రాయగలిగిన వారందరూ చదువగలిగితే యింకేముంది? ఇంతే మన తెలివితేటలు.

రాధా: చాలా బాగుంది.—ఇక దిగు. (దిగుతున్నాడు.)

మేజి: కోట్రయ్యా, నువ్వెక్కు—. (కోట్రయ్య ఎక్కుతున్నాడు.)

పబ్లి: ఏం పేరు భోలాబాత్.

కోట్రి: మావోళ్ళలాగే యెట్టినారు కాబోల పేరు.

జగ: కానివ్వండి, కానివ్వండి. మీయిష్టం వచ్చినట్టు కానివ్వండి.

పబ్లి: నువ్వు అచ్చి అసలు మగడివి.

కోట్రి: కాకేం?

అచ్చి: ఎవడివిరా, నువ్వు, నినోరాడిపోను?

కిత్తి: ఏమీ! మళ్ళీఅను ఆమాట? నీప నేమవుతాదో!

పబ్లి: కోర్టువారు ముద్దాయీల మాటలను చేష్టలను గమనించవలెను.

మేజి: చూస్తున్నాము.

పల్లి: ఇది నిన్ను విడిచి పోయింది కదూ?

కొట్రి: మరేటి?

అచ్చి: చా, నోరుముయ్!

కీర్తి: నీకు పానాలమీా దాశనేదా?

పల్లి: కోర్టువా రీసాక్షిని రక్షించవలెను. వీళ్లింతటికయినా తెగిస్తారు.

మేజి: ఏమీభయము లేదు. సర్కారువారి దీర్ఘహస్తము సకల ప్రజలకున్ను అభయ మిస్తున్నది.

పల్లి: సర్కారుశక్తి ఘనమైన కోర్టువారిలో ఆవేశించి ఉన్నంత కాలమున్ను....

రాధా: మీ ముఖప్రీతిమాట లింక చాలించండి.

పల్లి: ఏమండీ, మీకుకూడా ముద్దాయీలలో చేరవలెననిఉందా యేమిటి?

హను: మీ బెదరింపు లింక కట్టిపెట్టండి. ఘనమైన కోర్టువారు న్యాయమూర్తులు. వారు మాకున్ను న్యాయమునే అను-గ్రహిస్తారు.

పల్లి: నా ఛీఫ్ సరి.

మేజ: క్రాస్!

రాధా: నీ పేరు?

కొట్రి: కొ....

పట్లి: భూ...

రాధా: ఇదుగో, మీరుండండి.

పట్లి: భూలా...

జగ: ఏమండీ, మళ్ళీ తగులు కొన్నారూ?— ఇట్లామాట అం-
దిస్తూ ఉంటే, మేమీకేసులో పనిచేయలేము.

మేజ: ఏమండీ, పబ్లికుప్రాసిక్యూటరుగారూ, మీ రడ్డు వస్తూ ఉండకండి. మీకు మే మనుకూలముగా ఉన్నామని లోకమనుమానించకూడదు.

పట్లి: నేనే మన్నాను?

రాధా: నీ పేరు?

కొట్రి: నా పేరే నాకు తెలదనుకొన్నా వేటి?

రాధా: ఏమిటో చెప్పు.

కొట్రి: బొబ్బట్.

జగ: బలే, బలే! ఇద్దెన కాదూ?

రాధా: అయితే అది నీభార్య అంటావు?

కాట్రి: మరేటనమన్నావు! నీబారియనమంటావా! కాని, అలాగే అనుకో. నన్నుమాత్రం సిక్కులోకి దింపక!

రాధా: అది నీభార్య అవునా, కాదా?

కాట్రి: ఈడేమో, 'నాబారియ' అంటాడు. ఈయన నా 'నాబారియ' అనమంటాడు. నువ్వుకూడా 'నాబారియ' అనుకొంటే అనుకో.

అచ్చి: ఎర్రోడి పెళ్ళాం వాడవోడిసంట. ఏమర్రా, మీకెవళ్ళకి బుద్దులున్నాయా, నేదా?

రాధా: మా కొశ్చన్ సరి.

మేజి: ఆర్గ్యుమెంట్లు కానివ్వండి.

పబ్లి: నేను దీర్ఘముగా ఆర్గ్యుమెంటు చేయనక్కరలేదు. ఈ-కి త్తయ్య, అచ్చి, అనేవాళ్లు కమ్యూనిస్టులు. వీళ్ళకు తగిన శిక్ష వేయకపోతే ఈలోకమంతా తల్లకిందయి-పోతుంది. కాబట్టి, ఇట్టికేసులు కోర్టులలో జరుగకుండా ఉండేటట్లు పెద్ద శిక్ష విధించవలెనని ఘనమైనకోర్టువారిని ప్రార్థిస్తున్నాను.

మేజి: రాధానాథన్ గారూ, మీరు కానివ్వండి.

రాధా: ఈదేశములో కమ్యూనిజమేగాని. కమ్యూనిజము లేదు. బహుదూరిజమేకాని బోల్షివిజము లేదు, నామినాలిజమే కాని నేషనాలిజమసలే లేదు, ఫోకిల్లాయిజమేకాని సోష-లిజమే లేదు. ఈవిషయమై నేను ప్రమాణముచేసి చెప్ప గలను. నన్ను చూడండి. నేను కార్యదర్శిగానో, అధ్యక్షుడుగానో, కార్యనిర్వాహక సభ్యుడుగానో లేని సంస్థలేదు. నేను కలుగజేసుకోని ఉద్యమమేలేదు. నా అనుభవమును బట్టి మనవి చేస్తున్నాను. అవన్నీ సురక్షితముగా లేవని ఎవరు చెప్పగలరో చెప్పమనండి.

పల్లి: అవి ముందుకు నడుస్తే కదూ? తమప్రభావమటువంటిది!

రాధా: అవునామరి? అదే నేనంటున్నది. చూచినారా, ప్రాసి-క్యూషనువారుకూడా నాతో ఏకీభవిస్తున్నారు. వారికి నేను కృతజ్ఞుడను....ప్రస్తుతపు కేసులో ఈ కిష్టయ్యా, అచ్చి, అనే ఈముద్దాయీలు కేవలము అమాయకులు. వాళ్ళ మొగాలు చూస్తేనే అది తెలుస్తుంది. ఈ-మెుర్రెడ్డి, కోటయ్యా, అనేపడవవాళ్ళు అచ్చిని మోసము చేసి తీసుక వచ్చినారు.

పల్లి: అయితే, పోలీసువారు తప్పుడుకేసు పెట్టినారంటారా?

జగ: మావాద మదికాదు. పోలీసువారు తమ ధర్మమును శ్లాఘాపాత్రముగానే నిర్వర్తించుకొన్నారు.

హను: పోలీసువారు పొరపాటుపడ్డారని మాత్రము మా వాదము.

శ్రీ. రా. అ: అవు!

రాధా: నేను మాత్రము ప్రాసిక్యూషనువారి ఊహ కవకాశము లేదంటానా? కాని....

మేజి: సరే లెండి. ఇకచాలు.

రాధా: ఘనమైన కోర్టువారు...

మేజి: ఇక కూర్చోండీ!

రాధా: మహాఘనమైన కోర్టువారు...

మేజి: ఏమండీ, చెప్పితే వినబడదూ, సిట్ డౌన్ ప్లీజ్.

రాధా: చిత్తం, చిత్తం. (కూర్చుంటున్నాడు.)

మేజి: ఇదుగో తీర్పు చెప్పుతున్నాను—
ఈకేసు చిన్నదంటే చిన్నదనుకోవచ్చును: పెద్దదంటే పెద్దదే అనుకోవచ్చును. ముద్దాయీలను విడిచిపెట్టడానికి కారణములున్నవి; శిక్ష విధించడానికి కూడా కారణములున్నవి. వీళ్లు అమాయకులనడానికి అవకాశమున్నది. కుట్రమనుష్యు లనడానికిన్ని అవకాశమున్నది. ఇట్టి సందిగ్ధవిషయములో ఏమి చేయవలెనో క్రిమినల్ ప్రొసీజరు కోడ్డులో సూచనలేదు.

రాధా: బెనిఫిట్ ఆఫ్ ది డౌటు అక్యూజుడుకు ఇవ్వవలెనని ఉంది.

పల్లి: లేను, ఎంత మాత్రమున్ను లేదు. అట్లాచేస్తే సంఘానికి దేశానికికూడా గొప్ప ఉపద్రవము జరుగుతుంది.

మేజి: మేమీ రెండు విషయాలను గమనించినాము. అందుచేత మేము చెప్పే తీర్పేమంటే, "ఈకి త్తయ్యను. అచ్చిని విడిచి పెట్టాతున్నాము."

కి త్త: అదీ, అదీ, అట్లా ఉండాల. ధర్మప్రభువులు—రారయే. అచ్చీ, పోదాము.

అచ్చి: నాకి త్తయ్యా, నాకు మళ్ళీ సిక్కి—నావా? (కౌగిలించు కొంటున్నది.)

మేజి: ఎయ్, కోర్టులో అటువంటిపనులు చేయకూడదు. నా- తీర్పు పూర్తిగా వినండి—"కి త్తయ్యని, అచ్చిని తుంగభద్ర ఒడ్డున వాళ్ళగుడిసెలోనే ఇంటర్న చేస్తున్నాము.

కి త: అంటే?

మేజి: అంటే మీరాస్థలములోనే ఉండవలెను. విడిచిరాకూ- డదు.—వస్తే, మిమ్మల్ని పోలీసువారు ఎరెస్టుచేస్తారు.

అచ్చి: ఒకసారి అనుబవమయింది. యింకో రావడమే! ఈ శిచ్చ మాబాగుంది. కి త్తయ్య యెల్లకాలం నాకాడనే వుంటాడు. రా, మామా, పోదాము.

మేజి: ఉండండి. ఇంకా తీర్పు కాలేదు. వీళ్ళిద్దరూ ఈమధ్య తోవలో ఎక్కడయినా దాటిపోతారేమో, అందుచేత, కొట్రియ్య, మొర్రిడ్డి, తమపడవలో వాళ్ళగుడిసెకు దిగబెట్టవలెను.

కొట్రి: మాకేంపట్టింది? అల్లనే పొమ్మనండి.

మేజి: హెయ్, మాట్లాడకూడదు. వాళ్లను దిగబెట్టినట్టు మాతో వచ్చి చెప్పాలి. ఓయ్, పోలీసు, వీళ్లుదిగబెడతారో లేదో, నువ్వుకూడా వీళ్లతోపోయి, తిరిగివీళ్లని కోర్టులో హాజరు పెట్టు. నీకు ప్రయాణం బత్తా యిప్పిస్తాములే.

పోలీ: చిత్తం.

గుమాస్తా: ఈదినానికి కోర్టు బర్తరఫ్!

(అందరూ పోతున్నారు.)

(కిత్తయ్య. అచ్చి పాడుతారు)

ఇద్దరున్ను: పోలో - పోలో - పొంగాలి _ పోలో
పొంగాలి - లోకాలు _ సింగార - ముతోను - పోలో.

కిత్తయ్య: రాజుగా - రింట్లోను - రాణులే - వుంటేను

రంగైన - నాయచ్చి - నారాణి - అవుతాది - పోలో.

అచ్చి: రాచపూ - తుళ్ళకి - రాచకొడు - కులుంటె

రంగుకి - త్రడునాను - రాచకొడు - కవుతాడు - పోలో